# గుర్వష్టకము–7

## శ్రీ శంకరాచార్యులవారు

న భోగో న యోగో న వా వాజిరాజౌ
న కాన్తాసుఖే నైవ విత్తేషు చిత్తమ్,
గురోరంఘ్రి పద్మే మనశ్చేన్న లగ్నం
**తతఃకిం తతఃకిం తతఃకిం తతఃకిమ్.**

తా॥ భోగములందుగాని, యోగములందుగాని, రథగజ తురంగాదులందుగాని, కాంతలందుగాని, ధనమునందు గాని ఇచ్ఛలేకున్నప్పటికిని, గురు పాదపద్మములందు మనస్సు లగ్నము కానిచో ఏమి ఫలము?

వ్యాఖ్య :– ఇతర కోర్కెలెవ్వియు లేకున్నప్పటికిని, మనస్సు ఊరకనుండరాదు. చిత్తమును తమస్సునందు, అకర్మణ్యత్వమందు దిగజారనీయక, జాగ్రతగ చూచుచు సచ్చిదానంద పరబ్రహ్మమునందు నెల కొల్పవలెను. అట్టి శాశ్వత సద్వస్తువును చేరుటకు దారిచూపు సద్గురువరేణ్యుని పాదపద్మములను సేవించవలెను. ఇట్టి గురుభక్తి, దైవభక్తియే జీవునకు శాశ్వతానందమును, బంధవిముక్తిని ప్రసాదించ గలవు.

ఓం



| సంపుటము : 24 | జనవరి 1992 | సంచిక 1 |
|---|---|---|

## సంపాదకవర్గము

గౌరవ సంపాదకులు :

డా॥ రావుల సూర్యనారాయణమూర్తి M.A.,D.Litt. శ్రీ సముద్రాల లక్ష్మణయ్య M. A.

| | |
|---|---|
| సంపాదకులు : | బి. ఈశ్వర్ |
| సహాయ సంపాదకులు : | బోధచైతన్య, M.A. ఓంప్రకాశ్ B.Sc. |
| సంవత్సర చందా : | రూ. 30/-లు |
| పంపవలసిన అడ్రసు : | మేనేజరు, వేదాంతభేరి కార్యాలయము<br>అనిల్ బిల్డింగ్స్, సూర్యారావుపేట<br>పి.బి.నెం.323, విజయవాడ-520 002<br>ఫోన్స్ : 61862, 64017 Telex : 0475 362 ANIL |
| శాశ్వత చందా : | రూ. 300/-లు. |
| పంపవలసిన అడ్రసు : | 'వేదాంతభేరి శాశ్వతనిధి'<br>శ్రీ శుకబ్రహ్మాశ్రమము, శ్రీ శుకబ్రహ్మాశ్రమము<br>పోస్టు, శ్రీకాళహస్తి-517 640<br>ఫోన్ నెం. 239 STD Code 085 78 |

చందాదారులు ఉత్తర ప్రత్యుత్తరములలో తమ చందా నంబరు తప్పక ఉదహరించవలెను. చందా నంబరు మీకు పోస్టులో వచ్చు 'వేదాంతభేరి' కవరుపై యుండును.

[illegible]

అనుష్ఠాన వేదాంతమును బోధించు ఆధ్యాత్మిక మాసపత్రిక

## BE FEARLESS : నిర్భయులై యుండుడు!

### విషయ సూచిక



**: ముఖచిత్రము :**

గజముఖా! పార్వతీపరమేశ్వర తనయా! చతుర్భుజా! ఏకదంతా! లంబోదరా! గణాధిపా! ప్రసన్నవదనా! శ్రీ విఘ్నేశ్వరస్వామీ! నీకు మనసా వచసా శిరసా నమస్కృతములు.







యత్కీర్తనం యత్స్మరణం యదీక్షణం
యద్వందనం యచ్ఛ్రవణం యదర్హణమ్
లోకస్య సద్యో విధునోతి కల్మషం
తస్మై సుభద్రశ్రవసే నమోనమః

ఎవరిని గూర్చిన కీర్తనము, స్మరణము, దర్శనము, వందనము, శ్రవణము, పూజనము జనుల యొక్క కల్మషమును (పాపమును) తక్షణమే తొలగించివేయుచున్నదో అట్టి పరమాత్మకు మరల మరల నమస్కారము.





**M**ay I be born again and again, and suffer thousands of miseries so that I may worship the only God that exists, the only God I believe in, the sum total of all souls, and above all my God the wicked, my God the miserable, my God the poor of all races, of all species, is the special object, of my worship.

సర్వజీవరాసుల హృదయములందు వెలయు వారును, దుష్టులయందును, బాధితులయందును, బీదవారియందును కూడ వర్తించువారును, ప్రపంచమున సర్వత్ర వ్యాపించియున్న ఏకైక దైవమును, నేను సంపూర్ణముగ విశ్వసించినట్టి భగవంతుని ధ్యానించుటకై నేను మరల మరల జన్మించుదునుగాక! మరల మరల పెక్కు క్లేశములను అనుభవించుదునుగాక! ఎట్టి స్థితి యందైనను దైవమే నా ధ్యేయము.

OO



# ధర్మసత్రము

## శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు



ధర్మసత్రములందు యాత్రికులనుగాని, తదితరులనుగాని దీర్ఘకాలము ఉండనివ్వరు. రెండు మూడు దినములైన పిమ్మట బయటకు సాగనంపుదురు. సొంత ఇంటిలో ఉండులాగున సత్రములలో ఉండుటకు వీలువడదు. ఈ ప్రపంచమొక సత్రము వంటిది. ప్రాణులు వచ్చుచున్నవి, పోవుచున్నవి. జనులు పుట్టుచున్నారు, మరణించుచున్నారు. ఎల్లకాలము ఈ ప్రపంచమును అంటిపెట్టుకొనియుండు వారెవరును లేరు.

[illegible]
[illegible]
[illegible]
[illegible]

అని యోగవాసిష్ఠమున ఒకానొక విద్యాధరుడు పలికిన వాక్యములు ఈ సందర్భమున పేర్కొనదగియున్నవి. 'తమకు వినాశము కలుగకుండ ఎవరు వరములను కోరుకొనిరో, మూడు లోకములను ఎవరు నిరాటంకముగ పరిపాలించిరో అట్టి మహామహులు కూడ కాలచక్రమున బడి

నలిగిపోయి బూడిదలో కలిసిపోయిరి'— అని ఆ విద్యాధరుడు పలికెను. వాస్తవముగ ఈ ప్రపంచములో స్థిరనివాసమేర్పరచుకొనినవారెవరును లేరు. ఉండబోరు.

ప్రయాతాః పార్థివాశ్చాన్యే
కా ధృతిర్మమ జీవితే.

'నా తాతలు, ముత్తాతలు, మహారాజులై భూమండలమును పాలించి యున్నప్పటికిని గాలిచే ధూళివలె వారందఱును కాలమను ఝంఝా మారుతమున కొట్టుకొనిపోయిరి. ఇక నా జీవితము ఒక లెక్కా'—అని జనకమహారాజు తనలో తాను వితర్కించుకొనెను. పంచభూతములగు పృథివీజలాగ్నివాయురాకాశముల యొక్క సమ్మేళనముచే ఏర్పడిన ఈ జడమైన దేహము ఏనాటికైనను తిరిగి ఆ పంచమహాభూతములందు విలీనమై పోవలసినదే. కార్యమగు ఘటము కారణమైన మృత్తికయందు ఎప్పటికైనను విలయము కావలసినదే.

కొన్ని ప్రాణులు స్వల్పాయుర్దాయము కలిగియుండును. మఱికొన్ని దీర్ఘకాలము జీవించును కాని పుట్టిన ప్రాణి ఏ నాటికైనను గిట్టక మానదు. 'జాతస్య హి ధ్రువో మృత్యుః'—అని గీతాచార్యులు పేర్కొనియే యున్నారు. కాబట్టి ఈ ప్రపంచము ఒక తాత్కాలిక నివాసస్థలమే కాని శాశ్వత నివేశము కాదని స్పష్టమగుచున్నది. వాస్తవముగ ఇదియొక ధర్మసత్రమేయగును.

మానవుని ఆయుఃపరిమితి నూఱు వత్సరములని శాస్త్ర ములందు తెలుపబడియున్నప్పటికిని అనంతకాలమునందు అదియొక రెప్పపాటు కాలమేయగును. అపార కాలవాహినియందు నూఱేండ్లు ఒక్కక్షణతుల్యమే కాగలదు. కనుకనే భర్తృహరి తన సుభాషితమునందు ఈ ప్రకారముగ పేర్కొనియుండెను.

క్షణం బాలో భూత్వా క్షణమపి యువా కామరసికః
క్షణం విత్తైర్హీనః క్షణమపి చ సంపూర్ణవిభవః
జరాజీర్ణైరంగైర్నట ఇవ వలీమండితతనుః
నరః సంసారాన్తే విశతి యమధానీ యవనికామ్.

అనగా, సంసారమనెడు నాటకమునందు మనుష్యుడను నటుడు క్షణకాలము బాలుడుగను, క్షణకాలము భోగరసికుడైన యువకుడుగను, క్షణకాలము దరిద్రుడుగను, క్షణకాలము మహాధనసంపన్నుడుగను, క్షణకాలము వృద్ధుడుగను నటించి తుదకు యమలోకమను తెరమఱుగునకు పోవుచున్నాడు.

జీవితము బుద్బుదము (నీటిబుడగ) వంటిదనియు, తటిల్లతా సదృశము. (మెఱుపు వంటిది) అనియు పెద్దలు శాస్త్రములందు వక్కాణించియున్నారు. రైలులో ప్రయాణము చేయువారు ఎల్లకాలము రైలుపెట్టెయందే నివసించుటకు వీలులేదు. వారి వారి స్టేషన్లు రాగానే దిగిపోవలసినదే. అట్లే ఏ ప్రాణియు ఈ ప్రపంచమున దీర్ఘకాలము కొనసాగుటకు వీలులేదు.

కాబట్టి మానవుడు అతి స్వల్పమగు తన ఆయుర్దాయమును పారమార్థిక లక్ష్యసిద్ధికై వినియోగించుట శ్రేయస్కరము. 'ప్రాక్ శరీర విమోక్షణాత్' అని శ్రీ కృష్ణభగవానుడు గీతయందు వచించిన చందమున ఆధ్యాత్మిక సాధనలను శరీర వియోగమునకు పూర్వమే పూర్తిచేసికొనవలయును. అయితే దేహవియోగమెపుడు సంభవించునో ఎవరికిని తెలియదు. కాబట్టి సాధ్యమైనంత త్వరలోనే, అనగా బాల్య, యౌవనకాలములందే సాధనలను పూర్తిచేసికొనుట ఉత్తమము.

ఈ ప్రపంచమొక ధర్మసత్రము వంటిదనియు, ఎక్కువకాలమిచట ఉండుటకు అవకాశము లేదనియు విజ్ఞుడగువాడు బాగుగ నిశ్చయించుకొని భగవంతుని చేరుటకు వలసిన సాధనసంపత్తిని ఇచటనే అతి శీఘ్రముగ సంపాదించుకొని కృతకృత్యుడు కావలయును.

ఇనుము వేడిగ నున్నపుడే దానిని వంచివేయవలెను *(Strike the iron when it is hot)*. చల్లబడిన పిదప వంచుటకు సాధ్యపడదు. అట్లే మానవజీవితము అంతముకాక పూర్వమే అద్దానిని దైవసాక్షాత్కారమునకు వినియోగించవలెను.

# నాది ఏది?

శ్రీ మాదిరాజు మురళీకృష్ణ గారు (న్యూఢిల్లీ)

నాది నాది అనే ఓ నరుడా!
నీది ఏది?
ఇది నా శరీరం అంటావు!
ఇది నా కాలు, నా చెయ్యి,
నా తల, నా పొట్ట అంటావు.
ఆ శరీరంపై అధికారం చేసే
నీవు ఎక్కడ వున్నావు?
నాదనే నీ శరీరంలో ఎన్ని నాడులున్నాయో
చెప్పగలవా? ఎంత నెత్తురు నీ శరీరంలో
ప్రవహిస్తుందో చెప్పు చూద్దాం?
నీలో ఎముకలెన్ని? కనురెప్పపై వెంట్రుకలెన్ని?
చెప్పలేని నీకు నాదనే అధికారం ఎక్కడిది?
కనుక నాదనుకునే నీ భావన
ఒక ఆభాస మాత్రమే.
నీది నీ శరీరమే కానప్పుడు,
నీదని తలిచేదంతా సున్న.
కనుక నీది లేదు.
నీవు (ఆత్మ) మాత్రమే వున్నావు.

OO

# రామాయణ ప్రభ

## శ్రీ రాముని ఉపదేశామృతము

ఎవడు ధర్మముయొక్క, వేదముయొక్క పద్ధతిని వదలివేయునో, అట్టి వాడు పాపకర్మయందు ప్రవృత్తుడగును. అతని ఆచారవిచారములు భ్రష్టమై పోవును. కనుకనే అతడు సజ్జనులలో ఎన్నడును సమ్మానమును పొందనేరడు. సత్యము యొక్క పాలనమే రాజులయొక్క దయాప్రధానమగు ధర్మము, సనాతన ఆచారము, సత్యమందే జగత్తంతయు ప్రతిష్ఠితమై యున్నది. ఋషులు, దేవతలు సదా సత్యమునే ఆచరించిరి.

ఈ ప్రపంచమున సత్యవాదియగు మనుజుడు అక్షయపరమధామమునకు పోవును. అబద్ధము చెప్పువానిని చూచి జనులు సర్పమువలె భయపడుదురు. ప్రపంచమున సత్యమే ధర్మముయొక్క పరాకాష్ఠయనియు, అదియే అన్నిటియొక్క మూలమనియు చెప్పబడుచున్నది. ప్రపంచమున సత్యమే ఈశ్వరుడు. సత్యము యొక్క ఆధారముపైననే సదా ధర్మము ప్రతిష్ఠితమై యున్నది. సత్యమే అన్నిటి యొక్క మూలము. సత్యమును మించిన పరమపదము వేఱొకటిలేదు.

దానము, యజ్ఞము, హోమము, తపస్సు, వేదము వీనియన్నిటియొక్క ఆధారము సత్యమే అయియున్నది. కావున సర్వులును సత్యపరాయణులై యుండ వలెను. ఎవడు తన ప్రతిజ్ఞను భంగమొనర్చుటకై ధర్మమునుండి భ్రష్టుడైపోవునో, అట్టి చపలచిత్తునిచే నొసంగబడు హవ్యకవ్యములను దేవతలు, పితరులు స్వీకరింప రని మనము వినియున్నాము. నేను ఈ సత్యరూప ధర్మమును సమస్త ప్రాణులకు హితకరమని, సమస్త ధర్మములలో శ్రేష్ఠమని తలంచుచున్నాను. సజ్జనులు ధర్మమును పరిపాలించుదురు.

కావున నేను వారిని అభినందించుచున్నాను. భూమి, కీర్తి, యశస్సు, లక్ష్మి- ఇవియన్నియు సత్యవాదిని పొంద నభిలషించుచుండును. శిష్టుడగు మనుజుడు సదా సత్యమునే అనుసరించును. కావున మనుజుడు సదా సత్యమునే సేవించవలయును.



- చందనపు చెట్టును నరుకు గొడ్డలికి ఆ చెట్టు సువాసన యిచ్చును. సత్పురుషులున్ను అట్టివారే.
- అసాధ్య రోగములకు కూడ భగవన్నామస్మరణకు మించిన దివ్యౌషధములేదు.
- విశాల హృదయులకు లోకమంతయు కుటుంబమే.
- మాట తిరుగలేరు మానధనులు.
- తప్పులెన్నువారు తమ తప్పులెరుగరు.
- ప్రపంచమంతయు ఒక నాటకరంగము. అందు స్త్రీ పురుషులందరు పాత్రధారులు.
- తాను అనుభవించిన ఆనందమును ఇతరులకు కలిగించుటకు చేయు ప్రయత్నమే కళ. ○○

ఈ కర్మభూమిని పొంది శుభకర్మనే అనుష్ఠించవలెను. అగ్ని, వాయువు, సోముడు, శుభకర్మ ఫలమువలననే ఆయా పదవులను పొందియున్నారు. దేవరాజగు ఇంద్రుడు నూరు యజ్ఞముల నాచరించి స్వర్గలోకమును పొందెను. మహర్షులున్ను ఉగ్రతపస్సును గావించి దివ్యలోకములందు స్థానమును బడసిరి.

సత్యము, ధర్మము, పరాక్రమము, సమస్త ప్రాణులందు దయ, అందరితో ప్రియముగ మాట్లాడుట, దేవతలను, అతిథులను, బ్రహ్మనిష్ఠులను పూజించుట వీనినన్నింటిని సాధుమహాత్ములు స్వర్గలోక మార్గముగ పేర్కొనిరి. ఎవరు ధర్మమునందు తత్పరులై యుందురో, సజ్జనసాంగత్యము గలిగియుందురో, తేజస్సంపన్నులైయుందురో, దానమను గుణము ప్రధానముగ గలిగియుందురో, ఏ ప్రాణికిని బాధను గలిగింపరో, మాలిన్యము లేక యుందురో అట్టి శ్రేష్ఠులగు మునులే ఈ ప్రపంచమున పూజనీయులైయుందురు. ○○

# నామసంకీర్తన



1. విఘ్నేశా తవచరణం । విఘ్న వినాశక తవచరణం
గంగాధరహర గౌరిమనోహర । గిరిజాతనయా తవచరణం
మూలాధారా మోదకహస్తా । మోక్షప్రదాయక తవచరణం
జ్ఞానాధారా జ్ఞానవినాయక । నటనవినోదా తవచరణమ్॥

2. సత్య సనాతన ఓం శివ ఓం । సర్వజన ప్రియ ఓం శివ ఓం
నిత్య మనోహర ఓం శివ ఓం । నిర్మల చరితా ఓం శివ ఓం
భక్త వత్సలా ఓం శివ ఓం । భవభయ హరణా ఓం శివ ఓం
దయాసాగరా ఓం శివ ఓం । ధర్మస్వరూపా ఓం శివ ఓం
అనంతరూపా ఓం శివ ఓం । ఆపద్బాంధవ ఓం శివ ఓమ్॥
ఓం శివ ఓంశివ ఓంశివ ఓం । ఓంశివ ఓంశివ ఓంశివ ఓమ్।

3. రామచంద్రాయ జనక । రాజజా మనోహరాయ
మామకాభీష్టదాయ । మహిత మంగళం
దేవకీదేవి పుత్ర । కృష్ణ దేవోత్తమాయ
పరమ దివ్య గురువరాయ । భవ్య మంగళమ్॥

If you are pure, if you are strong, you, one man, are equal to the whole world.

పవిత్రుడవు, బలవంతుడవు నీవగుచో నీవొక్కడవే ప్రపంచమంతటితో సమానుడవు అగుదువు.

# ఆధ్యాత్మిక  కథలు

## నియమ పరిపాలన

గాంధీ మహాత్ముడు తన జీవిత కాలమున లౌకిక, పారమార్థిక, రాజకీయ రంగములందు ఎంతయో క్రమశిక్షణను పాటించువారు. తన చరిత్రను, తన శీలమును చక్కదిద్దుకొనుటకై వారెంతయో అభ్యాసము, సాధన గావించినవారు. భగవంతుని యెడల వారికి అపరిమితమైన భక్తి విశ్వాసములు కలవు. ప్రతిదినము అవకాశము దొరికినపుడెల్ల గాంధి గారు భగవన్నామస్మరణ, దైవప్రార్థన చేయుచుండువారు.

ఎన్ని ఇతర పనులున్నప్పటికిని వారు దైవప్రార్థన నియమము తప్పక చేయుచుందురు. రామనామమును జపించుచుందురు. ప్రార్థనాది దైవకార్యములందు గాంధి గారు కొన్ని నియమములను ఏర్పాటుచేసికొని తు.చ. తప్పకుండా వాటిని పాటించువారు.

అది బ్రిటిష్ పరిపాలనా సమయము. స్వరాజ్య సంపాదనకై మహాత్ముడు కాంగ్రెస్ నాయకత్వమును వహించి బ్రిటిష్‌వారితో శాంతి యుత పోరాటమును సలుపుచుండెను. త్యాగము, అహింస, సత్యము మున్నగు ఉదాత్త గుణగణములకు రాజకీయ రంగమున కూడ స్థానము కలదని తన బోధల ద్వారా, చేష్టల ద్వారా ఉద్యమముల ద్వారా మహాత్ముడు నిరూపించుచు, భారతీయులకేకాక, పాశ్చాత్యులకు కూడ ఆశ్చర్యమును కలిగించుచుండెను.

గాంధీ మహాత్ముడు ప్రతిదినము ఉదయము నిద్ర లేవగానే దైవ ప్రార్థన చేయును. మరల స్నానాద్యనంతరము కొంతసేపు దైవ ధ్యానము

కావించును. మఱల రాత్రి భోజనాత్పూర్వము దైవప్రార్థన చేయును. ఈ ఆధ్యాత్మిక నియమములను గాంధి గారు సమర్థవంతముగ పాలించు చుందురు. కాని ఒకనాటి రేయి రాజకీయ క్షేత్రములో తలమునకలుగ పనిచేసి అలసిసొలసి గాంధి గారు ఇంటికి రాగానే భార్యయగు కస్తూరిబాయి గారు వారికి భోజనం వడ్డించిరి.

గాంధి మహాత్ముడు భోజనముచేసి రాత్రి పరుండెను. కాని నిద్ర పట్టలేదు. ఒడలంతయు చెమట పట్టుచుండెను. ఏదియో పొరపాటు గావించినట్లు వారికి తోచెను.

దీర్ఘముగ విచారించగా ఆనాడు దైవ ప్రార్థన చేయకయే ఆహారము భుజించినట్లు తేలినది. అపుడు గాంధీజీ ఆ పొరపాటునకు చాల పశ్చాత్తాపపడి, ఇకమీదట ఎన్నడును అట్టి పొరపాటు తన జీవితమున రాకుండుటకై కృతనిశ్చయుడయ్యెను.

**నీతి : నియమపాలన అన్నిరంగములందును అవసరము. అది జీవితమునకు వన్నె తెచ్చును. ఆధ్యాత్మరంగమున సాధకులకు నియమ పాలనము అత్యవసరము. మనస్సును, ఇంద్రియములను నిగ్రహించుటకు జీవితమును క్రమపద్ధతిలో నడుపుటకు నియమపాలన ఎంతయో దోహదమును కలుగజేయును.**

**కాబట్టి ముముక్షువు పరమార్థ క్షేత్రమున అభివృద్ధిని సాధించుటకై కొన్ని నియమములను ఏర్పఱచుకొని వాటిని సక్రమముగ పాలించుచు తన చరిత్రను పరిశుద్ధముగా నుంచుకొనవలెను.**

OO

---

Spirituality can never be attained until materiality is gone.

**దృశ్యభావము తొలగనిదే దైవభావము ఎన్నటికి కలుగ నేరదు.**

# పరమహంస సదుపదేశములు

## శ్రీ రామకృష్ణ పరమహంస ఇట్లు చెప్పిరి-

1. ఒక గృహమందు కోడలు అత్త మామలను, మరియు ఇతరులను ఆదరించుచు, ప్రేమించుచున్నప్పటికిని తన భర్తయందు విశేష ప్రేమానురాగములను కలిగియుండును. ఆ ప్రకారముగనే భక్తుడు తన ఇష్ట దైవమందు మిక్కుటముగ భక్తి, ప్రేమ, విశ్వాసము కలిగియున్నను ఇతర దేవతలయందు ద్వేషము కలిగియుండక, దేవతలందరు ఒకే దైవము యొక్క వివిధ రూపములే అని భావించి గౌరవించవలయును.

2. ప్రతి మతము భగవంతుని చేరుటకు మార్గమును బోధించును. ముముక్షువునకు కావలసినది భక్తిశ్రద్ధలు మాత్రమే.

3. కోరికలచే ఈడ్వబడు మనస్సు భగవద్ధ్యానమందు ఏకాగ్రతను పొందలేదు. కాబట్టి కోరికలను విడనాడి శాంతమనస్కుడై దైవచింతన చేయవలెను.

4. మలిన జలముగల గుంటయందే పాచిపెరుగును. నిర్మలజలముగల తటాకమునందు పాచి పెరుగజాలదు. అదే విధముగ సంకుచిత మనస్సు గలవానియందే స్వార్థబుద్ధి, ఈర్ష్య ద్వేషాదులు కలుగుచుండును. సత్ప్రవర్తన విశాల హృదయము గలవానియందు దుర్గుణములు ఏ మాత్రము ఉండనేరవు. అతడు తోటి ప్రాణుల యెడల ప్రేమ, దయ, సహనము కలిగియుండును. సద్గుణములు, సచ్ఛీలము కలిగి దైవధ్యానాదుల నాచరించువాడు శీఘ్రముననే భగవంతుని పొంది అమితానందమును అనుభవించును. ○○



# సందేహాలు - సమాధానాలు

డాక్టర్ ఎస్.బి.రఘునాథాచార్యులు గారు M.A., Ph.D.
(తిరుపతి)

ప్రశ్న : *భక్తుల ప్రవృత్తులెలా ఉంటాయి? మహాభక్తులకు మోక్షం కలగడానికి భగవంతుడు వారినెలా ఉద్ధరిస్తాడు? మనలో ఉన్న అజ్ఞానాన్ని, పాపాన్ని ఆయన పోగొడతాడా? అలా ఆయన పోగొట్టాలంటే మనమేం చేయాలి?*

జవాబు : భగవంతునిపై నిండైన భక్తిగలవారు ఎల్లప్పుడూ మనస్సును ఆతనిపైనే ఉంచి, ప్రాణాలను, ప్రాణశక్తిని ఆయనకే సమర్పించి, ఆయన్ను గురించి పరస్పరం ఒకరికొకరు బోధించుకుంటూ, సంభాషించుకుంటూ, సంతోషాన్ని, గొప్ప ఆనందాన్ని పొందుతుంటారు. ఇలా ఎవరు మనస్సును, ఇంద్రియాలను ఎన్నటికీ దేవునిలోనే లీనంచేసి, ప్రేమతో ఆయన్నే సేవిస్తారో వారికి ఆయన తనను చేరడానికి సాధనమైన సమబుద్ధిని కటాక్షిస్తాడు. అంతేగాక వారి భక్తిప్రపత్తులకు మెచ్చి, ఎలాగైనా వారిని ఉద్ధరించాలని జాలితో వారికి జ్ఞానప్రకాశాన్నివ్వడం ద్వారా అనేక జన్మల నుంచి వస్తున్న అజ్ఞానాంధకారాన్ని నాశనం చేస్తాడు. హృదయాంతర్వర్తిగా ఉండి వారి అజ్ఞానాన్ని పోగొట్టి, వారికి మంచి వివేకాన్ని, సత్ప్రవృత్తిని కలిగిస్తాడు. దానిద్వారా వారికి మోక్షార్హత కలిగి, వారు సంసారబంధాల నుంచి ముక్తిని పొందుతారు.

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే॥
(భగవద్గీత 10-10)

ప్రశ్న : దేవుడున్నాడా? ఉంటే చూపెట్టగలవా? అంటాడు మిత్రుడొకడు. ప్రపంచమంతా భగవంతుడుంటే ఆయన్ను మనమెలా గుర్తించేది? దీనికైదైనా ప్రమాణం ఉందా?

జవాబు : దేవుడు తప్పకుండా ఉన్నాడు. ఆయన్ను గుర్తించడానికి అడుగడుగునా ప్రమాణాలున్నాయి. కాకపోతే మనకు ఓర్పు, మంచి అవగాహన లేవు కాబట్టి, ఆయన్ను గురించి మనం తెలిసికోలేకపోతున్నాం. చూడండి : దేవుడే, ఇలా స్వయంగా చెబుతున్నాడు. లోకంలో కొన్ని పదార్థాల్లో అతిశయించిన తేజస్సు కనపడుతుంది. కొన్ని వస్తువులు చాలా అందంగా, శోభగా ఉన్నాయి. ఒక చక్కని నర్తకి మంచి నృత్యం చేస్తున్నది. ఎర్రగులాబీ అందంగా ఘుమఘుమలాడుతుంది. పండితుడు జ్ఞానానికి పుట్టిల్లులా ఉన్నాడు. శిల్పి చక్కని శిల్పాన్ని చెక్కగలుగుతున్నాడు. వస్తువుల్లో, వ్యక్తుల్లో కనబడే ఆ అతిశయం, ఆ శోభ, ఆ శక్తి, ఆ సామర్థ్యం ఇవన్నీ మనకెక్కడివి? ఇవన్నీ భగవంతుని అంశవల్ల మనకేర్పడినవే. సహజంగా మనలో ఏమీ లేదు. ఆ భగవచ్ఛక్తి ద్వారా లోకంలో అన్నిచోట్ల ం భగవంతుణ్ణి చూడవచ్చు. పాలల్లో మీగడలా, నువ్వుల్లో నూనెలా భగవంతుడు ప్రపంచంలో ఉన్నాడు. చూచే హృదయంతో, సాధనతో వెతికిచూస్తే కనబడతాడు.

యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా।
తత్తదేవావగచ్ఛ! త్వం మమ తేజోంశసంభవమ్॥
(భగవద్గీత 10-41) ○○

## శౌనక ఉవాచ

స్మృత్వా సకలకల్యాణభాజనం యత్ర జాయతే
పురుషం తమజం నిత్యం వ్రజామి శరణం హరిమ్.

ఎవరిని స్మరించినంత మాత్రముచేతనే మనుజుడు సమస్త శుభములకును నిలయుడగునో; సమస్త దేహములలో క్షేత్రజ్ఞుడుగ నివసించువాడును, పుట్టుకలేనివాడును, నిత్యుడును అగు ఆ శ్రీహరిని నేను శరణుజెందుచున్నాను.

సీరియల్

# బుద్ధుని గురించి తెలుసుకుందాము

## అంబపాలి చరిత్ర

ఈశ్వర్

ఒకానొక రాజ్యములో అంబపాలి అను వేశ్యయుండెను. ఒకనాడు ఆమె తన ఆమ్రవనంలో తిరుగుచుండెను. అచట బుద్ధునిగాంచి "ఎవరు మీరు? ఇక్కడికెందు కొచ్చారు?" అని అడిగింది. భగవానులు వివరణ ఇచ్చారు. తదుపరి ఆమె "నిండు యౌవనములో వున్న మీరు సన్న్యసించుట యెందుకు? దానిలో గల మర్మమేమి? మీ రూపురేఖల్లో చాలా సౌకుమార్యం కనిపిస్తుంది, మీరు రాజవంశములోనివారుగ వున్నారు" అన్నది.

"ఎలా వున్నా నాశనం తప్పదుగదా? నన్నెవరని అడుగుచున్నావు. చెప్తాను విను. నాది కపిలవస్తు నగరం. నేను శుద్ధోదన మహారాజ కుమారుణ్ణి. నన్ను సిద్ధార్థుడంటారు. నేను ఈ భౌతిక వాంఛలకు దూరంగా వుండాలని బయలుదేరి నాను. ఈ వ్యాధులకు, బాధలకు, ముసలితనానికి, మరణాలకు కారణం తెలుసు కోడానికి బయలుదేరాను" అన్నారు భగవానులు.

### అంబపాలి మనస్సు మారుట

ఈ మాటలు విన్న అంబపాలి మనస్సు భౌతిక సుఖాలు, సంపదలు, సంపాదనల నుండి ఒక్కసారి వెనుదిరిగింది. "ఇంతవరకు నేను ఎంతో పాపముచేశాను" అని బోరుబోరున ఏడ్చి "క్షమించండి ప్రభో" అని భగవానుల పాదాలపై వాలి "ప్రభూ! నా ఇంటిని పావనము చేయండి. నా భిక్ష స్వీకరించండి" అని ప్రాధేయపడింది.

భగవానులు ఆమె యొక్క పశ్చాత్తాపమును చూసి ఆమె మనస్సు కుదుట పరచుటకొరకు ఆమె ఇంట భిక్ష స్వీకరించుటకు అంగీకరించి బయలుదేరిరి.

లోకులు కాకులు, యథార్థ విషయములకంటే కల్పితాలకు ప్రాధాన్యత ఇచ్చుట కొందరి సహజ వృత్తి.

### అపవాదు

భగవానులు అంబపాలి ఇంట భిక్ష స్వీకరించు విషయము ఊరంతా ప్రాకింది. "బుద్ధుడంతటి పవిత్ర హృదయుడు, తపస్వి, సన్న్యాసి, సాధువు ఒక వేశ్య ఇంట భిక్ష స్వీకరించుటయా? ఎంత దోషము, ఎంత తప్పు, ఎంత పొరపాటు. అసలు ఆమె గురించి బుద్ధునికేమైనా తెలుసా? తెలిసే అంగీకరించారా? తెలియక అంగీకరించారా? బహుశా తెలియకనే అలా జరిగి వుండవచ్చును" అని వారి వారి ఊహలతో కొందరు బుద్ధుని వద్దకేతెంచి అంబపాలిని దూషిస్తూ, ద్వేషిస్తూ, హీనంగా అంబపాలి చరిత్రను ఏకరువుపెట్టిరి. వారు చెప్పినదంతా సావధానంగా, శాంతంగా, గంభీరంగా విన్నారు భగవానులు. అలా చెప్పుచుండినవారు చెప్పి చెప్పి భగవానుల సమాధానము కొరకు నిరీక్షించిరి.

### భగవానుల సమాధానము

"అయిందా? మీరంతా చెప్పదలచింది, ఇంకా ఏమైనా మిగిలిందా?" అన్నారు భగవానులు. ఈ విధంగా పరిపరి విధముల అంబపాలిని గూర్చి చెప్పుచున్న జనంలో నుండి ఒకరిని పిలిచారు భగవానులు. అతని ఒక చేయి పట్టుకొని "నాయనా! ఇప్పుడు చప్పట్లు చరచు అన్నారు. ఈ చేయి వదలండి చరుస్తానన్నాడు. ఖాళీగా మరో చేయి వుందిగా ఆ చేయితో కొట్టు అన్నారు. ఒక చేత్తో ఎలా సాధ్యం అన్నాడు అతను. ఒక్క చేత్తో చప్పట్లు కొట్టుట ఎలా అసాధ్యమో! అంబపాలి ఒక్కతే ఎలా చేస్తుంది? జారత్వం? రెండవవారెవరూ లేకుండానే ఆమె కులటయ్యిందా? ఈ నగరంలో చాలామంది ఆ పనిలో మునిగియున్నారు. కావున జారత్వం సాగింది. మీలో ఎవరూ ఆమె గడప తొక్కకుండా ఉన్నట్లయితే ఆమె ఆ విధంగా మారి వుండేదా? ఆమెకు డబ్బిచ్చి మభ్యపరచి చెడగొట్టింది ఆ స్థితికి దిగజార్చింది మీరు. ఎవరైనా ఇటువచ్చి నేనెలాంటి పాపము, అక్రమము, అన్యాయము, దోషము చేయలేదని ఖచ్చితముగ చెప్పండి. ఆమె ఇంటికి భిక్షకు వెళ్ళకుండా మీ ఇంటికే భిక్షకు వస్తాను. రండి ఈ చెడు చేయనివారెవరో ఇటు వచ్చి నిలవండి" అన్నారు భగవానులు. ఎవరూ ముందుకు అడుగువేయలేదు.

"మరో విషయం ఆలోచించండి. వైద్యులు ఎవరికి కావాలి? రోగికి! పుణ్యం

ఎవరికి కావాలి? పాపికి. శిక్ష ఎవరికి వేయాలి? నేరస్థునికి. పశ్చాత్తాపము ఎవరు పడాలి? పాపము, తప్పు చేసినవారు. మరో విషయం. ఓడ నడి సముద్రములో సాగిపోతుండగ నావలో లోనికి నీరు చేరి మునిగిపోతుంది! నీరు ఎత్తి పారపోయుట మంచిదేకాని ఓడకు పట్టిన రంధ్రం మూయుట అత్యంత ముఖ్యమైన పని. సంఘములోనూ అంతే. చెడు ఎటునుండి, ఏ దారిగుండా, ఏవైపునుండి వస్తుందో గమనించి వారిని బాగుచేయాలి. మీ మీ కుళ్ళును, అసూయను, ఈర్ష్యను, ద్వేషమును వదలండి. ముందు మీరు బాగుపడండి. తరువాత చెడినవారిని బాగుచేయండి. సంఘానికి, ధర్మానికి కట్టుబడి, ధర్మము తప్పకుండా, సంఘాన్ని వదలకుండా బుద్ధిగా ఆలోచనతో నడచుకొండి. ఎవరికివారు పాపం చేయకుండా, ధర్మము తప్పకుండ నడచుకుంటే చాలు"

–ఈ విధంగా ఎన్నో ధర్మరహస్యాలను బుద్ధభగవానులు వారికి బోధించి వారి మనస్సులను మార్చి వారిని శాంతింపజేసి వారిని ధర్మమార్గమున త్రిప్పిరి. అంబపాలి ఇంట భిక్ష స్వీకరించిరి. ○○

### ధర్మ రహస్యము

**న తత్పరస్య సందధ్యాత్ ప్రతికూలం యదాత్మనః**
**ఏష సంక్షేపతో ధర్మః కామాదన్యః ప్రవర్తతే.**

**తనకేది ప్రతికూలమో దానినితరులకు చేయరాదు. ఇదియే ధర్మము యొక్క సంక్షిప్త స్వరూపము. దీనికి విరుద్ధముగ జరుపబడునదియంతయు యథేచ్ఛా వ్యవహారమే కాగలదుగాని ధర్మము కానేరదు.**

**(భారతము అనుశాసనపర్వమున బృహస్పతి ధర్మరాజునకీ ప్రకారముగ బోధించెను. ధర్మము యొక్క స్వరూపమెట్టిదో దీనిచే స్పష్టముగ వెల్లడి యగుచున్నది. దీనినే శ్రీకృష్ణభగవానుడు ఆత్మౌపమ్యత్వమని గీతయందు పేర్కొనిరి. నీవలె ఇతరులను చూచుకొనుము. నీకు కష్టము కలిగినపుడు దానిని తొలగించుకొనవలెనని ఎట్లు పాటుపడెదవో, అట్లే ఇతరులకు కష్టములు సంభవించినపుడును వానిని తొలగించుటకు యత్నింపుము! ఇదియే ధర్మరహస్యము.)**

# మహాత్ముల ప్రబోధము

## శ్రీ రామతీర్థస్వామి

1. బ్రహ్మానందం నీలో వుంటే భిక్షగాడిలాగ, దరిద్రుడులాగ భిక్షమెత్తుకుంటూ దైన్యముపడడము దేనికి? నీ సత్యాత్మను గ్రహించు. దివ్యుడవని తెలుసుకో. ఆనందసముద్రములో ఓలలాడు.

2. ఈ అనంత దేహాల్లో అంతర్గతమై భాసించే ఆత్మ, సూర్యులకు సూర్యుడు, వెలుగుల్లో వెలుగు, సర్వకాలము ప్రకాశించే జ్యోతి, సర్వావస్థలలో శాశ్వతమై, నిత్యమై ప్రకాశించే ఆత్మభానుడు. అదే మీరు! అదే మీరు!!

3. ఆత్మే సర్వమని తెలుసుకోండి. స్వార్థానికి, అహంకృతికి అతీతులు కాండి. అపుడే పరిపూర్ణమైన ఆనందం, అపుడే మీరు సర్వజగదైక్యం పొందుతారు.

4. ఈ శరీరానికన్నా, ఈ మనస్సుకన్నా నేను వేరేనని సత్యాన్ని నీవెపుడు గ్రహిస్తావో అపుడు అన్ని ఆందోళనలు, భయములు వికావికలవుతవి, దుఃఖము నశిస్తుంది.

5. ప్రపంచ పరిస్థితులవల్ల, కర్మలవల్ల, వ్యాపారమువల్ల, ద్వంద్వాలవల్ల చలించిన నీవు ఏకాంతంగా ఆత్మధ్యానం చేసుకో. అపుడు శాంతి, ఆనందము కలుగుతుంది.

6. ఒక్క నిమిషము వాంఛాదూరుడువు కమ్ము. రాగద్వేషసంగాది విహీనుడు కమ్ము. ఓం, ఓం, అని గానము చేయి. అపుడు నీ వ్యక్తిత్వం సర్వము తేజోమూర్తి అవుతుంది. పరిపూర్ణ ప్రశాంతి, స్వస్థత కలుగుతుంది.

OO

# నిత్యస్మరణీయము

అహర్నిశం యత్పరిచిన్తనీయమ్
సంసార మిథ్యాత్వ శివాత్మతత్త్వమ్

నిరంతరము దేనిని గూర్చి చింతన చేయుచుండవలెను? అను ప్రశ్నకు–

1. ఈ ప్రపంచము అనిత్యము,
2. ఆత్మ శాశ్వతము.

–అని పదే పదే తలంచుచుండవలెనని పెద్దలు వచించియున్నారు.

దృశ్యపదార్థములు అనిత్యములని చింతనచేయుటవలన వాటిపై వైరాగ్యము కలుగగా మనస్సు బహిర్ముఖత్వమును వదలి అంతర్ముఖత్వమును పొంది ఆత్మవైపునకు పయనించును. ఎందరో మహారాజులు పుట్టిరి, గిట్టిరి. వారేమి వెంట తీసుకొని వెళ్ళగలిగిరి? అని లెస్సగ భావనచేయుచు వైరాగ్యమును అభ్యసించవలెను.

అట్టి వైరాగ్య సేవనముతో పాటు ఆత్మచింతనము కూడ నిరంతరము గావించుచుండవలెను. "నేను జడమగు దేహము కాదు, సచ్చిదానంద ఆత్మ చైతన్యమునే" అని పదే పదే తలంచుచుండవలెను.

నిరంతరము ఈ రెండు ధర్మములను చక్కగ చింతన చేయుటవలన జీవునకు ఆత్మానందము, పరమశాంతి కలుగగలవు.

శ్రీ శంకరాచార్యులవారు తమ "ప్రశ్నోత్తర మణిరత్నమాల"లో పై విధముగ తెలియజేసిరి. ○○

**Body is only mind in a grosser form; Mind is composed of finer layers and the body being the denser layers.**

**స్థూలరూపమున ఉన్న మనస్సే దేహము. మనస్సు సూక్ష్మాణువులచేతను, ఈ దేహము స్థూలాణువులచేతను ఏర్పడినవి.**

## [illegible]

1. దేహములో 18,000 కిలోమీటర్ల పొడవుగల రక్తనాడులు కలవు.
2. ప్రపంచములోకెల్ల పెద్దదైన సిమెంటు ఫ్యాక్టరీ దక్షిణ కొరియాలో స్సాంగ్‌యాంగ్ కార్పొరేషన్‌కు కలదు. అది సంవత్సరమునకు 1 కోటి 15 లక్షల టన్నుల సిమెంటు ఉత్పత్తి చేయును.
3. బ్రిటన్‌లో లండన్ గ్లాస్కోల మధ్య ఒక రైలు గంటకు 257 కిలోమీటర్ల వేగముతో నడచును.
4. భూమికి, సూర్యునకుగల దూరమునకు ఐదు రెట్లు దూరములో బృహస్పతి అను చాల పెద్ద గ్రహము తిరుగుచున్నది. అది అన్ని గ్రహములకంటెను పెద్దది.
5. ప్రపంచములోకెల్ల ఎత్తైన జలపాతం దక్షిణ అమెరికాలోని వెనిజూలా అడవులలో కలదు. దాని పేరు ఏంజిల్ జలపాతము. దీని ఎత్తు 3300 అడుగులు.
6. అమెరికాలోని కాంగ్రెస్ లైబ్రరీలో 7 కోట్ల 30 లక్షల పుస్తకములు కలవు. అవి ఉంచబడిన షెల్పుల మొత్తం పొడవు 350 మైళ్లు.
7. అంగారకునకు, బృహస్పతికి మధ్య లక్షలాది చిన్న చిన్న గ్రహములు తిరుగుచున్నవి. అందు సెరిస్ అను గ్రహము యొక్క వెడల్పు 480 మైళ్లు. పల్లాస్ అను గ్రహము యొక్క వెడల్పు 300 మైళ్లు. వెస్టా వెడల్పు 240 మైళ్లు. OO

# మజ్జిగ

ఓంప్రకాశ్

"చల్లకొచ్చి ముంత దాచటం దేనికి?" అంటూ మన సాహిత్యకారులు, అనేక సందర్భాలలో వాడుతుంటారు. మనవారు చల్లను (మజ్జిగను) అమ్ముకునే వారు కాదు; వితరణం చేసేవారు. వేసవికాలంలో దాహంగొన్నవారికి చల్లను త్రాగటానికి ఇచ్చేవారు. ఇప్పుడలాంటి వితరణ రోజులు పోయినా, చల్లకున్న విశిష్టత-విశిష్ఠంగానే ఉంది.

చల్లనే మజ్జిగ అనంటారు. పాలు తోడుపెట్టి, పెరుగుచేసి, దాన్ని చిక్కగా చిలికితే, వెన్న-మజ్జిగ తయారౌతాయి. వెన్న ఇక మరల మజ్జిగలో కరగదు. వెన్నను వేరుచేసి, స్వచ్ఛమైన మజ్జిగను భోజనంలో వాడుకుంటారు.

మజ్జిగను ఔషధంగా కూడా ఉపయోగిస్తారు. వాత ప్రకోపంలో శొంఠి-సైంధవలవణాలతో పుల్లని మజ్జిగ సేవించాలి. పిత్త ప్రకోపంలో పంచదారతో, కఫ వృద్ధిలో శొంఠి-పిప్పిలి-మిరియాల చూర్ణంతో మజ్జిగను గ్రహించాలి.

ఇంగువ-జీలకర్ర-సైంధవ లవణం-వీటి చూర్ణంతో మజ్జిగను సేవిస్తే, అతిసార-మూల వ్యాధులు నయమౌతాయి. మూత్రకృచ్ఛ్రంలో బెల్లంతో, పాండురోగంలో చిత్రమూల చూర్ణంతో మజ్జిగను పుచ్చుకోవాలి.

మజ్జిగను, ఎఱ్ఱచక్కెర-తేనే-ఉప్పు-వీటిలో దేనితోనైనా సేవిస్తే, మజ్జిగలోని దుర్గుణాలు విరిగి, అది హితకరం అవుతుంది. మజ్జిగతో వండిన అన్నం గ్రహణి, మూలవ్యాధి, బడలిక, వాతం-వీటిని హరిస్తాయి. తియ్యటి తాజా మజ్జిగ నూతన రక్తమాంసాలను పెంపొందిస్తుంది. పుల్లని మజ్జిగ, ప్రేవులలోని విషక్రిములను

నశింపచేస్తుంది. భోజనం చివరగా మజ్జిగను త్రాగితే, ప్రేవులలో నిలిచి ఉన్న అజీర్ణ పదార్థాలు నిశ్శేషంగా బహిర్గతమై, నూతన రక్తం పెరుగుతుంది.

మజ్జిగ జీర్ణరసాలను అధికంగా ఉత్పత్తి చేస్తుంది. అలా జీర్ణశక్తి పెరుగుతుంది. శరీరానికి పుష్టి, ఆరోగ్యం చేకూరుతాయి. జీర్ణశక్తిని, రక్తవృద్ధిని కలిగించటంలో మజ్జిగకు మించిన మరో పదార్థం లేదీ లేదు.

శరీరంలో 'లాక్టిక్ ఆమ్లం' తక్కువైతే, త్వరగా ముసలితనం సంక్రమిస్తుంది. మనిషిలో ఉత్సాహం–బలం–చైతన్యం ఉండవు. మజ్జిగ ఈ ఆమ్లపు కొరతను తీరుస్తుంది. వ్యాయామం కూడా ఈ ఆమ్లాన్ని ఉత్పన్నం చేస్తుందంటారు.

వర్ష ఋతువులలో సైంధవ లవణంతో, గ్రీష్మ–శరదృతువుల్లో ఎర్ర చక్కెరతో, హేమంత–వసంత ఋతువుల్లో త్రికటుక (శొంఠి+పిప్పిలి + మిరియాలు) చూర్ణంతో కలిపి మజ్జిగను సేవిస్తే, చాలా హితకరంగా ఉంటుంది; ఋతుదోషాలు నశిస్తాయి.

మజ్జిగలో దిగువ గుణాలున్నాయని 'భావప్రకాశం' చెబుతుంది : ఆకలి పెరుగుట, నేత్ర రోగాలు హరించుట, జీర్ణశక్తి పెరుగుట, రక్తమాంసాలు వృద్ధి అగుట, ఆమ్ల వృద్ధిని అరికట్టుట, కఫ వాతాలను నశింపజేయుట.

నిత్యం మజ్జిగ తాగేవారికి ఏ రోగాలు రావు. మజ్జిగతో తగ్గిన రోగాలు మరల రావు. భూలోకామృతం మజ్జిగ–అంటూ భావప్రకాశం దీనిని ప్రశంసిస్తుంది.

వెన్న తీసిన మజ్జిగ తేలికగా ఉండి, పథ్యంగా పనికివస్తుంది. కఫదోషాన్ని హరిస్తుంది. వెన్నతీయని మజ్జిగ కఫాన్ని పెంచుతుంది.

ఆవు మజ్జిగ అన్నింటికన్నా శ్రేష్ఠం. ఉదర రోగాలను, మూలవ్యాధిని, శరీర స్థూలతను తగ్గిస్తుంది. మేక మజ్జిగ తేలికగా ఉంటుంది. త్రిదోషాలను శమింపచేస్తుంది. అతిసార, మూల, గ్రహణి, శూల, పాండు మొదలగు రోగాలను నయం చేస్తుంది.

బలహీన రోగులకు మజ్జిగవల్ల జీవశక్తి, బలం చేకూరుతాయి. మజ్జిగను కొంతకాలం సేవిస్తే, చిన్నప్రేవుల్లో 'ఎలాస్టిసిటీ' పెరుగుతుంది.

మజ్జిగలో 97.5% నీరు, 0.8% మాంసకృత్తులు, 1.1% క్రొవ్వు, 0.1% ఖనిజ పదార్థాలు, 0.5% పిండిపదార్థాలు, 0.3% కాల్షియం, 0.9% ఫాస్పరస్ ఉన్నాయి. 100 గ్రాముల మజ్జిగలో 0.03 మిల్లీగ్రాముల ఇనుము ఉంటుంది. ఏ,బి$_2$ విటమిన్లు అల్పంగా ఉంటాయి. ఇలా మజ్జిగతో అనేక రోగాలు ఉపశమిస్తాయి. మజ్జిగను రోజూ తప్పనిసరిగా సేవించేవారికి మంచి ఆరోగ్యం చేకూరుతుంది. ○○

# రామనామాక్షరద్వయము

## శ్రీ పంచాంగము శీనప్ప శాస్త్రి గారు (పుట్టపర్తి)

శ్రీ గుణాలంకృతము-రామనామాక్షరద్వయము పండితులకు గాని, పామరులకుగాని అత్యంత సులభమైన విధానంతో ఆత్మానందము కలుగచేయు పెన్నిధి శ్రీ-రామ-పదము.

రామ నామంలోని- ర కారము - అగ్ని బీజము.

ర + ఆ + మ = ఆ కారము-సూర్యబీజము.

ర కారము అగ్ని బీజమై-సాధకుని పాపములను కడిగివేస్తున్నది.

మ కారము చంద్రబీజమై అమృతత్వాన్ని ప్రసాదింపగలదు. ఆది భౌతిక-అధి దైవిక-ఆధ్యాత్మిక తాపములను హరింపచేయు సమర్థత గల్గియున్నది. హృదయానికి శాంతి ప్రసాదించి పరమపదాన్వేషకునికి భగవదానందము అందించుచున్నది.

రామ పదోచ్చారణముచే ఇడా పింగళ సుషుమ్నా నాడుల సంచాలన విధానము సులభతరమై దివ్యానందానుభూతికి దోహదమగుచున్నది. ర=సుషుమ్న, అ=పింగళ, మ=ఇడ-సంకేతమును పొంది బీజాక్షర సమన్వయమే రామనామాక్షర ద్వయమనే అవగాహనకు ప్రోత్సాహమయినది.

ర=కర్మ, అ=జ్ఞానము, మ=భక్తి-ఈ విధముగా మూడు రకాల భక్తి సాధనలకు సాధకుడు సన్నిహితుడు కాగలడు.

అంతేకాకుండా-రామనామము మహావాక్యాలకు కూడా సన్నిహితమై యలరారుచున్నది.

1) 'ర'కారము-తత్ పదార్థము. అనగా భగవంతుడు (తత్)

'మ'కారము-త్వం పదార్థము. అనగా జీవుడు. ఈ రెంటిని కలిపిన రామ యగుచున్నది.

ర=తత్ } తత్వము-ఇందుమూలముగ "తత్వమసి" మహావాక్యము
మ=త్వమ్ } స్థానమేమిటో తెలిసినది.

2) శ్లో|| సదారామోఽహమస్మీతి తత్త్వతః
ప్రవదంతి యే న తే సంసారిణో నూనం
రామ ఏవ న సంశయః

ఎల్లప్పుడూ నేనే రాముడని తాత్త్వికముగా యే సాధకుడు భావించగలడో అప్పుడతడు దుఃఖ బంధమునకు దూరుడగుచున్నాడు. అట్టివాడు నిస్సంశయముగా రాముడే కాబట్టి అహం బ్రహ్మాస్మి మహావాక్యము రామ పదమందించే దివ్యతత్త్వము.

3) తురీయస్థితి రాముడనే అర్థానికి సన్నిహితమైనది. అనగా ఆత్మలో రమించునపుడు ఆత్మానందానుభూతినందుకొని తురీయ స్థితిని చేరి శోకానికి దూరం కాగలడుకదా? అందువలన ప్రజ్ఞానం బ్రహ్మ సమన్వయమునకు తోడ్పడుచున్నది.

4) అయమాత్మా బ్రహ్మ- ఈ జీవుడును బ్రహ్మయే జీవోబ్రహ్మైవనాపరః. కాబట్టి రామభక్తుడు రాముడగుచున్నాడు.

రామ పదము అక్షరాస్యులుగాని, నిరక్షరాస్యులుగాని సులభంగా ఉచ్చరించి తరించడానికి వీలగుచున్నది. మరణ శయ్యపైనున్న వ్యాధిగ్రస్తుడు సైతము ఉచ్ఛ్వాస నిశ్వాసలతో-రా,మ-అని భావించి జన్మరాహిత్య ప్రేరితమైన భగవదానందమును పొందవచ్చును.

"పెదవి కదలని చదువు చదివితే పదవి దొరుకును రామనామమని" బ్రహ్మంగారి తత్త్వాలను పాడి జానపదులానందిస్తారు.

లోపలికి పోయే ఉచ్ఛ్వాసంతో-రా; బయటికి వచ్చే నిశ్వాసంతో- మ భావించి లోకాతీతమైన, భావాతీతమైన, పరమ ప్రశాంతిని పొందుటకవకాశమున్నది.

○○

**నీవు ప్రేమనపేక్షించిన యెడల ప్రేమను జూపుము. నీకు న్యాయము జరుగవలెనన్న నీ ప్రవర్తనయందు ఋజుమార్గమును జూపుము. నీవిచ్చుదానికి అనుకూలముగ నిచ్చు శక్తి ఈ ప్రకృతికి స్వభావమై యున్నది.**



# యోగవాసిష్ఠసారము

## 1. వైరాగ్య ప్రకరణము

పూర్వము సుతీక్ష్ణుడను బ్రాహ్మణుడు సందేహయుక్తుడై అగస్తిముని ఆశ్రమమునకుఁబోయి, వారిని నిట్లడిగెను– 'మహాత్మా! మోక్షమునకు సాధనము కర్మయా, లేక జ్ఞానమా, లేక రెండూనా వచింపుడు?' అంత నమ్మునీశ్వరుఁడిట్లు నుడివిరి–

'పక్షులు తమ రెండు రెక్కలతోటి ఆకసమున నెగురునట్లు జ్ఞానకర్మల రెండిటితోను మోక్షము పొందఁబడుచున్నది. కాబట్టి రెండును మోక్షసాధనములని చెప్పబడినది. ఇవ్విషయమున నొక పురాతన వృత్తాంతమును జెప్పెద వినుము– పూర్వకాలమున కారుణ్యుఁడను వేదపాఠియైన బ్రాహ్మణుడొకఁడు గలడు. ఆతఁడు అగ్నివేశ్యుని పుత్రుఁడు. గురువువద్ద వేదవేదాంగములన్నిఁటిని పఠించి విద్యావంతుఁడై స్వగృహమునకేతెంచి ఆతఁడు కర్మరహితుఁడై వసింపదొడఁగెను. అది గాంచి తండ్రి కారణమరయ, కారుణ్యుఁడిట్లు వచించెను–

'శాస్త్రములు కొన్ని అగ్నిహోత్రాది ప్రవృత్తిరూపధర్మములను బోధించుచున్నవి. మఱికొన్ని త్యాగముచేతనే మోక్షము లభించునని వాక్రుచ్చుచున్నవి. ఈ రెండిటి మధ్య సందేహగ్రస్తుడనై నైష్కర్మ్యత నవలంబించితిని'. ఆ వాక్యములను విని అగ్నివేశ్యుఁడిట్లు పలికెను– 'పుత్రకా! ఒక కథ వినుము. దానిని హృదయంగమమొనర్చుకొని ఆ పిమ్మట నీ ఇచ్చవచ్చినట్లొనర్చుము.

అప్సరసలలోకెల్ల నుత్తమురాలగు సురుచి యను నామె హిమవత్పర్వత శిఖరముపై వసించుచుండెను. ఒకనాఁడామె ఆకాశమున నేగుచున్న ఇంద్రదూతను

గాంచి 'నీవెవరు? ఎచటినుండి వచ్చుచున్నావు? ఎచ్చటికిఁ బోవుచున్నావు?' అని ప్రశ్నింప, ఆతఁడిట్లు నుడివెను–'అరిష్టనేమి యను రాజు తన రాజ్యమును బుత్రున కొసంగి, రాగరహితుఁడై తపంబాచరించుటకొఱకరణ్యమునకుఁజని గంధమాదన పర్వతముపై నిపుడు తపశ్చర్య గావించుచున్నాడు. ఆతనివద్దకొక కార్యార్థమేగి, ఇపుడు తిరిగి ఆ వృత్తాంతము నింద్రునకు వచించుటకై పోవుచున్నాను'. అంత నా యప్సరస 'అచట జరిగిన వృత్తాంతమేదియో చెప్పు'మని వేడ, దేవదూత యిట్లు చెప్పనారంభించెను–

'అరిష్టనేమి రాజచట తీవ్రతపంబాచరించుచుండ ఇంద్రుఁడది గాంచి, ఈ విమానమును గైకొని పలువురు అప్సరసలతోను, వివిధ వాద్యాదులతోను, గంధర్వ సిద్ధాదులతోను నచ్చోటికేగి, ఆతని నీ విమానముపై గూర్చుండబెట్టి స్వర్గనగరమగు అమరావతికిఁదీసికొని రమ్ము' అని నాకాజ్ఞ యిచ్చెను.

నేనట్లే వెడలి రాజున కా విషయమును దెలుప, అతడు "స్వర్గమునగల గుణములేవి? దోషములేవి?" అని ప్రశ్నింప నేనిట్లు చెప్పితిని–'ఓ రాజర్షీ! పుణ్యమువలన మనుజుడు స్వర్గమున సుఖమనుభవించును. ఇతరుల యైశ్వర్యమును గాంచి సహింపకుండుట, సమానుల యెడల ఈర్ష్య, తక్కువవారిని జూచి సంతోషించుట మున్నగు గుణములచటవారికి గలవు. పుణ్యము క్షయింప నచటవారు మర్త్యలోకమున జనింతురు'. ఆ నా వాక్యములను విని యాతఁడు 'అట్టి ఫలములతో గూడిన స్వర్గము నాకక్కరలేదు. నేను ఘోర తపంబాచరించి ఈ శరీరమును విడిచెదను. మీరు ఇంద్రుని కడకు వెడలిపొండు' అనెను.

పిమ్మట నే నింద్రునితో నా విషయమును దెలుప, ఆతడు 'నీవు మరల వెళ్ళి వైరాగ్యశీలుడగు నా రాజును తత్త్వజ్ఞుఁడైన శ్రీ వాల్మీకి మహర్షి వద్దకుఁ గొనిపోయి మోక్షప్రాప్తికి వలసిన తత్త్వజ్ఞానము నాతని కుపదేశింపవలసిందిగా నేను ప్రార్థించినట్లు, అమ్మహర్షికి వచింపుమ'ని నా కాజ్ఞ యిచ్చెను. తదనుసారము నేనా రాజును వాల్మీకి వద్దకు గొంపోవ అచట నమ్మునీంద్రుని 'సంసారబంధ దుఃఖనివారణోపాయము'ను గూర్చి యారాజడుగ వారు 'ఏద్దానిని విని అనుష్ఠించినచో జీవన్ముక్తి లభించునో, అట్టి యోగ వాసిష్ఠమును (వాసిష్ఠ రామాయణమును) పూర్ణముగ నీకుపదేశించెదను' అని చెప్ప, ఆ రాజు శ్రీరాముడెవరని ప్రశ్నింప, విష్ణుభగవానుడే మనుజాకారము ధరించి యవతరించెనని యా ఋషి వచించెను. OO

# వినోదము-వికాసము

## హృదయార్పణము

ఒక భక్తుడు కృష్ణున్ని ఇలా ప్రార్థించాడు-

దేవా! మహాత్మా! మీ నివాసము రత్నాలకు నిలయం. మీ భార్య లక్ష్మి. మీరు ముల్లోకాలకు ప్రభువు. ఈ ప్రకారంగా సర్వసంపదలకు ఆలవాలమైన మీకు ఇక నేనేమి ఇవ్వగలను? మీ మనస్సు గోపికలచే పరిగ్రహింపబడింది.

కాబట్టి నా మనస్సును మీకు అర్పిస్తున్నాను. దయతో స్వీకరించండి మహాప్రభో!

సముద్రానికి రత్నగర్భ అని పేరుంది. అది రత్నాలకు నిలయం. సముద్రంలో అగణితములైన రత్నాలు లభిస్తూంటాయి. భగవానుడు సముద్రమునే నివాసముగా గైకొని క్షీరసాగరముపై విలసిల్లుచున్నారు. కనుకనే భక్తుడు భగవంతుని నివాసం రత్నాలకు నిలయమని వర్ణించాడు.

ఇక సర్వసంపదలకు నిలయమైన లక్ష్మీదేవి సాక్షాత్ నారాయణమూర్తికి పత్నియై విరాజిల్లుతున్నది.

కాబట్టి ఏ విధంగా చూచిన కృష్ణపరమాత్మ సర్వసంపదలకు నిలయులై వర్తించుచున్నారు. అట్టి వారికి ఒకరు ఇచ్చేది ఏముంటుంది? ఒకరు ఏమివ్వగలరు? వారికి ఏ లోటున్నూ లేదు. బ్రహ్మాండములన్నీ వారి కుక్షిలోనే వున్నాయి.

కానీ వారి మనస్సు గోపికలచే పరిగ్రహింపబడింది కాబట్టి భక్తుడు తన మనస్సును గైకొనుడని ప్రార్థిస్తున్నాడు. మనస్సును భగవదర్పితము చేయుటయే జీవుని ముఖ్య కర్తవ్యం.

కృష్ణునకు, ఆత్మకు భేదం లేదు. మనస్సును కృష్ణునకు అర్పించడమంటే మనస్సును ఆత్మలో లయం చేయుటని అర్థం. అధిష్ఠానమైన ఆత్మలో మనస్సు ఎపుడు లయమౌతుందో అపుడిక జీవుని ఆనందానికి హద్దులుండవు. వడగళ్ళు సముద్రంలో పడి లయమై పోవునట్లు, మనస్సు రజోగుణ, తమోగుణాలను పారద్రోలి

# ఆత్మానుసంధానము

ముముక్షువులు ఈ క్రింద తెలుపబడిన మహోన్నత భావములను నిరంతరము మననము చేయుచుండవలెను.

**నాహం దుఃఖీ నమే దేహో బన్ధః కస్యాత్మనః స్థితః**

**ఇతి భావానురూపేణ వ్యవహారేణ ముచ్యతే.**

"నేను దుఃఖినిగాను, నాకు దేహము లేదు. ఆత్మకు బంధమెట్లుండగలదు?"– ఇట్టి భావములు గలిగి తదనుసారముగ వ్యవహరించుటచే జీవుడు ముక్తుడగును.

OO

విశుద్ధ సత్త్వాన్ని పొంది ఆత్మలో లయమౌతే త్రెంపులేని ఆనందం జీవునకు దొరకుతుంది. భక్తుని పై ప్రార్థన యొక్క ఆంతర్యం ఇదే.

కావున జీవుడా! నీ మనస్సును పరిశుభ్రం చేసుకొని, దాంట్లో ఏ విధమైన దోషాలు లేకుండా చేసుకొని దానిని భగవంతునకు అర్పించటం నేర్చుకో. భగవంతుడైన ఆత్మలో దానిని లయం చేయటమనే క్రియను సాధించు. అపుడు నీ జీవితం ధన్యమౌతుంది. అపుడు నీవు జనన మరణాలకు లోను కావు. మానవత్వం సార్థకమౌతుంది.

ఈ పని త్వరగా ప్రారంభించి జీవితం అంతం కాకపూర్వమే దానిని సాధించు! ఆనందం పొందు!! తరించు!!! జై గురుదేవ్.

–ఈ భావములనే క్రింది శ్లోకము నిరూపించుచున్నది–

రత్నాకరస్తవగృహం గృహిణో చ పద్మా
కిం దేయమస్తి భవతే జగదీశ్వరాయ
ఆభీర వామనయనాహృత మానసాయ
దత్తం మనో యదుపతే కృపయా గృహాణ

OO

# విజ్ఞాన వీచికలు

## ప్రయత్నఫలము

పూర్వజన్మ అశుభ సంస్కారములకు ఈ జన్మ శుభ సంస్కారములకు నిరంతరము పోరు సంభవించుచుండును. ఈ రెండిటిలో ఏది బలవత్తరముగ నుండునో అది జయించును. కాబట్టి ముముక్షువగువాడు ద్విగుణీకృతమగు ప్రయత్నము అభ్యాసము గావించి పూర్వజన్మ అశుభ సంస్కారములను వాసనలను తుద ముట్టించవలెను. ఈ జన్మయొక్క శుభ ప్రయత్నముచే పూర్వజన్మ యొక్క చెడ్డ అలవాట్లను రూపుమాపవలెను. నా అదృష్టము, నా ప్రారబ్దమెట్లున్నదో అని తలంపరాదు. సమధికోత్సాహముతో, ద్విగుణీకృత బలముతో, అధ్యవసాయముతో పూర్వపు దుష్ట వృత్తులను జయించివేయవలెను.

శ్లో॥ ప్రాక్తనం చైహికం చేతి ద్వివిధం విద్ధి పౌరుషమ్
ప్రాక్తనోఽద్యతనే నాశు పురుషార్థేన జేయతే

*తా॥* ప్రయత్నము రెండు విధములుగ వుండును. పూర్వజన్మ ప్రయత్నము, ఈ జన్మ ప్రయత్నము అని. ఈ జన్మ ప్రబల ప్రయత్నముచే పూర్వజన్మ ప్రయత్నమును జయించి వేయవచ్చును.

○○

# వీరిని గురించి తెలుసుకొందాం

## సుదర్శనుడు

ధ్రువసింధువు, మనోరమ అను రాజదంపతుల కుమారుడు సుదర్శనుడు. అతని చిన్నతనముననే తండ్రి మరణించెను. అతని తాతయు మరియు అతని సవతి తల్లియొక్క తండ్రియగు యుధాజిత్తు వారి వారి మనుమలను రాజ్యాభిషిక్తులుగ ఒనరించవలెనని పోట్లాడుకొనుచుండిరి. అందు ఒకరు మరణించిరి. అట్టి అశాంత వాతావరణము నుండి సుదర్శనుని రక్షించుటకై అతని తల్లి కుమారుని తోడ్కొని రహస్యముగ భారద్వాజాశ్రమమును చేరెను.

ఆ ఆశ్రమమునందు సుదర్శనుడు దేవిని ఆరాధించి విద్యను నేర్చుకొనెను. యుధాజిత్తు అతనిని మట్టుబెట్టవలెనని తలంచినవాడై ఆ ఆశ్రమమునకు వచ్చెను. గాని అతనికి అవకాశము లభించనందున తిరిగి వెడలిపోయెను.

కాశీరాజు యొక్క పుత్రికయగు శశికళ సద్గుణవంతుడగు సుదర్శనునే వివాహము కాగోరియుండెను. మరునాడు కాశీరాజు స్వయంవరమును చాటించి పలువురు రాజులను ఆహ్వానించెను.

అచటకు యుధాజిత్తు మరియు సుదర్శనుడును వచ్చి యుండిరి. యుధాజిత్తు సుదర్శనుని సంహరించుటకు కుట్ర పన్నెను. అది ఎఱింగి కాశీరాజు స్వయంవరమును మరునాటికి వాయిదా వేసెను.

కానీ ఆనాటి రాత్రికే తన కూతురునిచ్చి సుదర్శనునకు వివాహము చేసెను. ఆ విషయమెఱిగి మరుసటి దినమున రాజులందరు కాశీరాజుపై యుద్ధమునకు సన్నద్ధులు కాదొడగిరి.

అంతట సుదర్శనుడు, "రాకుమార్తె అభీష్టము మేరకే నేను ఆమెను పరిణయమాడితిని అని మీరందరు క్షమను వహించి మమ్ములను దీవించుడు" అని పలికెను. అయినను యుధాజిత్తు మరికొందరు రాజులు సుదర్శనునిపై పోరాటమునకు దిగిరి. వారినందరిని అతడొక్కడే సంహరించివేసెను. ➪

# అమృత బిందువులు

శీలం శౌర్యమనాలస్యం పాండిత్యం మిత్రసంగ్రహః
అచోరహరణీయాని పంచైతాన్యక్షయో నిధిః

**శీలము, శౌర్యము, సోమరితనము లేకుండుట, విద్య గడించుట, మిత్రులను చేరదీయుట అను ఈ ఐదింటిని దొంగలు అపహరింపని అక్షయ నిధులు.**

పఠతో నాస్తి మూఢత్వం జపతో నాస్తి పాతకమ్
మౌనినః కలహోనాస్తి న భయం చాస్తి జాగ్రతః.

**చదువుకొనువానికి మూఢత్వము వుండదు. భగవన్నామమును జపించువానికి పాపము వుండదు. మౌనము వహించువానికి ఎవరితోను కలహము వుండదు. మేలుకొనువానికి భయము వుండదు.**

OO

---

⇨ మరుక్షణమున అచట ప్రత్యక్షమైన దేవికి సుదర్శనుడు, కాశీరాజు, రాకుమార్తె నమస్కరించిరి.

తదుపరి సుదర్శనుడు కాశీరాజుయొద్ద సెలవు గైకొని, భార్యాసమేతుడై అయోధ్యకు వెడలి అచట రాజ్యాభిషిక్తుడై చక్కగ రాజ్యపాలనము గావించెను. రాజ్యపరిపాలనాదులందు అతడు మునిగియున్నను దేవి ఆరాధనను మరువకుండ నియమనిష్ఠలతో సలుపుచుండెను.

(సుగుణశీలుడైయుండువాడు, భగవద్భక్తి కలిగియుండువాడు జీవితమున కార్యసిద్ధిని బడసి, పరమశాంతిని అనుభవించుచుండును. మానవుడు ఎన్ని వ్యవహారములాచరించుచున్నను భగవచ్చింతనను, భగవద్ధ్యానమును మరువరాదు. దైవానుగ్రహముచే భక్తుని హృదయమున ఆత్మజ్ఞానముదయించుట వలన అతడు బ్రహ్మానుభూతిని బడసి బంధవిముక్తుడై విరాజిల్లును.)

సుదర్శనుని వృత్తాంతము 'దేవీభాగవతము'నందు కలదు.

OO



# వేదాంతగోష్ఠి

## నేటి చర్చనీయాంశము - శమము

**శిష్యుడు (శివప్రసాద్)** - మహాత్మా! గురుదేవా! మోక్షప్రాప్తికి బ్రహ్మ విచారణ అత్యవసరమనియు, ఆ బ్రహ్మ విచారణ చేయుటకు ముందు 4 సాధనలు (సాధనచతుష్టయ సంపత్తి) ఆచరించుట ఆవశ్యకములనియు తమరు సెలవిచ్చి, ఆ 4 సాధనలలో మొదటి రెండు సాధనలగు వివేకవైరాగ్యములను గూర్చి విపులంగ బోధించి, మూడవదియగు శమాదిషట్కసంపత్తిని గూర్చి సంక్షిప్తముగ తెలియజేసారు. ఇపుడు శమదమాది సద్గుణముల వివరములు తెలియజేయ ప్రార్థన.

**గురువు (ప్రబోధానందస్వాములవారు)** - శివప్రసాద్! ముముక్షువులకు అత్యవసరమైన ప్రశ్న వేశావు. సమాధానం చెప్తున్నాను సావధానంగ విను. శమదమాది సాధనలు 6 కలవు. వాటి పేర్లు ఇదివరకు నీకు చెప్పియున్నాను. మొదటిదియగు 'శమము'ను గూర్చి విను.

శమమనగా అంతరేంద్రియ నిగ్రహము. బుద్ధి, మనస్సు అంతరేంద్రియములు అనబడును. అంతరేంద్రియములగు ఈ రెండు నిగ్రహింపబడినపుడే మొత్తము అన్ని ఇంద్రియాలు స్వాధీనంలో వుంటాయి. కనుక సాధకునకు మనోబుద్ధుల నిగ్రహము అత్యంతావశ్యకము.

ఒక బండిగాని, బస్సుగాని లేక ఇతర వాహనముగాని పోవునపుడు డ్రైవర్ (నడుపువాడు) కీలకస్థానాన్ని ఆక్రమించుకొని యుంటాడు. డ్రైవరు కనుక సరైన స్థితిలో లేనిచో లేక వివేకము లోపించినవాడైతే బండికి వున్న గుర్రములు, బండి, లోపల వున్న యజమానుడు, తాను అందరు సర్వనాశనం అయిపోతారు. కనుకనే బండిని నడిపేటప్పుడు డ్రైవరు మహాజాగరూకతతో వుండాలి. ఈ శరీరమొక బండి, ఇంద్రియములు (కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు) గుర్రాలు, మనస్సు

పగ్గం, బుద్ధి డ్రైవరు, ఆత్మ యజమానుడు. కనుక ఈ ఉపాధి క్షేమంగ వుండాలంటే డ్రైవరగు బుద్ధి వివేకవంతుడై మెలగాలి. మనస్సు అనేది బుద్ధికి లోబడియుంటుంది. ఏదైన ఒక పని చేయాలంటే మనస్సు సూచన చేస్తుంది. అది చేయాలా లేదా అనే విషయం బుద్ధి నిర్ణయిస్తుంది. కాబట్టి బుద్ధి నిర్ణయించిన దానిని మనస్సునకు చెప్తే ఆ మనస్సు ఇంద్రియాల ద్వారా, శరీరం ద్వారా ఆయా పనులు చేయిస్తుంది.

ఇక్కారణమున బుద్ధిని చాల శుద్ధంగా, వివేకంగా వుంచితేనే మోక్షప్రాప్తి సుల భంగ చేకూరుటకు అవకాశముంటుంది. బుద్ధి వక్రిస్తే జీవిత కార్యక్రమమంతా వక్ర గతిలో పడిపోతుంది. బుద్ధికి మరొక పేరు మతి. కనుకనే పెద్దలు 'నీ మతిని బాగు చేసుకో' అని చెప్పుంటారు.

కావున మనుజుడు శాంతిని పొందాలంటే, నిర్వాణస్థితిని బడయవలెనంటే ఈ జీవితంలో పరమశాంతిని అనుభవించాలంటే బుద్ధి తీక్షణముగ (వివేకవంతముగ) వుండాలి. మనమెవరము? ఈ లోకములోకి ఎందుకు వచ్చాము? మన కర్తవ్యమేమి? బంధవిముక్తికి సులభోపాయమేమిటి? భగవంతుని సాన్నిధ్యాన్ని త్వరలో ఎట్లు చేరుకోవాలి? అను విషయాలను చక్కగ తెలుసుకొని, పెద్దల సాంగత్యము వలన, గురుబోధలవలన, శాస్త్రాధ్యయనము వలన పారమార్థిక రహస్యాలను చక్కగ గుర్తెరిగి వాటిని ఆచరణయందుంచుటకు మనస్సును ప్రేరేపించాలి.

ఈ ప్రకారంగా బుద్ధిని శుద్ధపరచి, ఆ బుద్ధి ద్వారా మనస్సును లోబర్చుకొనుటయే 'శమము' అని చెప్పబడ్తుంది. ఇదియే అంతరేంద్రియ నిగ్రహము. ఈ శమము ద్వారా 'దైవానుభూతి' అను లక్ష్యము, సులభంగ మానవునకు సంప్రాప్తిస్తుంది.

నాయనా! శివప్రసాద్! శమాది సద్గుణ సంపత్తిలో మొదటిది అయిన 'శమము'ను గూర్చి ఇపుడు విపులంగా తెలియజేశాను. ఇది చాలా ముఖ్యమైన సాధన. దీనిని శ్రద్ధతో, విశ్వాసంతో సాధించి పరమశాంతిని పొందు.

**శిష్యుడు** – గురుదేవా! తమ ప్రబోధంచే ఎంతో ఆనందం కలిగింది. మోక్ష సాధనలో కీలకమైన దానిని తెలియజేశారు. ప్రయత్నపూర్వకముగా ఈ సాధనను అవలంబించి జన్మను సార్థకం చేసుకొంటాను. సెలవు. OO

**The soul is superior to all environment**

**దృశ్య ప్రపంచముకంటె ఆత్మ ఎంతయో గొప్పది.**

# సాధ్వి సుశీలాదేవి గారు (శ్రీకాళహస్తి)

సర్వజీవులును స్వతస్సిద్ధముగ దుఃఖరహితులేయైనను, అనాద్యవిద్యావశమున భ్రాంతచిత్తులై క్లేశముల ననుభవించుచున్నారు. సంసారబాధాగ్రస్తులగు జీవులు ఐశ్వర్యఖనియగు ఈశ్వరునాశ్రయించి సర్వసుఖములను బడయవలసియున్నారు. భగవంతుడు నామరూపములు లేనివాడేకాని ఏ నామరూపములతో, ఏ విధానముతో భక్తులు భగవంతుని ఉపాసించెదరో ఆ నామరూపములద్వారా ఆ విధానమునను సరించి ఆయన ప్రసన్నుడగుచుండును.

భగవంతుడు కళ్యాణగుణప్రపూర్ణుడే గాక గుణాతీతుడు కూడ అగుచున్నాడు. ఆయనయొక్క నిర్గుణతత్త్వము నుపాసించుట, దేహాభిమానరహితులగు సర్వసంగ పరిత్యాగులకు మాత్రమే సాధ్యము కాగలదు.

కర్మ ధ్యాన జ్ఞాన మార్గములకంటె భక్తిమార్గము సులభసాధ్యమగుచున్నది. ఇందు మహాపాపులకు కూడ ప్రవేశార్హత గలదు. చోర కిరాతుడగువానిని కవితావృక్షము నెక్కించి రామరామేతి మధురాక్షరములను నోట పలికించి "వందే వాల్మీకి కోకిలం" అని పండిత ప్రకాండులచే సహితము ప్రార్థన చేయించినది ఈ భక్తిమార్గమే. వేద వేద్యుండు రాముడై యవతరించగా, వేదమును రామాయణముగా రూపొందించినది ఈ భక్తిమార్గ పురోగామియగు వాల్మీకియే.

భక్తి విధానములో హృదయశుద్ధి, నిష్కాపట్యము, కార్యకౌశలము, తాదాత్మ్యము, తన్మయత్వము ప్రత్యక్షమగుచుండును. ఈ తీరున దాస్య, సఖ్య వాత్సల్య, శాంత, మధురభక్తి వైవిధ్యము ప్రాముఖ్యములోనికి వచ్చినది.

1. భగవంతుడే నా ప్రభువు అను భావముతో శ్రీరాముని సేవించి కృతార్థుడైన భక్తహనుమాను దాస్యభక్తి లోకమునకు మార్గదర్శకమగుచున్నది.
2. భగవంతుడే నా పరమమిత్రుడు అను సఖ్యభావమున శ్రీకృష్ణునితో మైత్రి నెఱపిన అర్జునుని సఖ్యభక్తి నిరూపమానమగుచున్నది.

3. భగవంతుడే నా తండ్రియని పితృభావముతో పూజించిన ఏసుక్రీస్తుయొక్క పితృభక్తి సాటిలేనిదేగదా!

4. భగవంతుడే నా తల్లియని యారాధించిన శ్రీరామకృష్ణపరమహంస యొక్క మాతృభక్తి చరిత్రలో అపూర్వమైనదేగదా!

5. భగవంతుడే నా ముద్దు బిడ్డడు, అని సపర్యలొనర్చి వానికి ప్రత్యక్షముగ స్తన్యమిచ్చి సంతుష్టినొనర్చిన బంగాళాదేశపు వృద్ధ వనిత యశోదామాయి యొక్క వాత్సల్య భక్తి మనకు ప్రత్యక్ష గోచరమేగదా!

6. పండరీనాథుడే నా నాథుడని ప్రకటించి ఆ విఠోభాను ప్రేమించిన సక్కూబాయ్ యొక్క శాంతభక్తిని కొనియాడనివారుందురా?

7. భగవంతుడే నా సర్వస్వము. అతడే నా యాత్మ, ఆతడే నా హృదయ పుండరీకమున ప్రకాశించు పరంజ్యోతియని విలపించుచు, బృందావనమున కృష్ణ ప్రేమ విరహదగ్ధయై తన్మయత్వమున బాహ్యప్రపంచ స్మృతిని కోల్పోయిన రాధికాదేవి యొక్క మధురభక్తిని ప్రస్తుతించుటకు ఆదిశేషునికైనా ఆస్కారమగునా?

OO

# పూర్ణాహుతి

బ్రహ్మైవాస్మీతి బోధేన దేహోఽహమితి ధీపశుం
కృత్వా పూర్ణాహుతిం బ్రహ్మణ్యా శరీరో భవేన్మునిః.

**'నేను బ్రహ్మమును' అను బోధచే 'నేను దేహమును' అను అజ్ఞానమును బ్రహ్మజ్యోతియందు పూర్ణాహుతియొనర్చి మననశీలుడగు ముముక్షువు దేహరహితమగు ఆత్మయే అగుచున్నాడు.**

**(ఇదియే వాస్తవమగు పూర్ణాహుతి. ఇట్టిదియే వాస్తవమగు యజ్ఞము. ఇట్టి జ్ఞానయజ్ఞమును ఆచరించువాడు అచిరకాలములోనే పరమశాంతిని పొందగలడు.)**

# లోకోద్ధారకులు

## శ్రీ సర్వేశ్వరానందస్వాముల వారు (తిరుపతి)

మన భారతదేశము అతిబాల్యముననే అద్భుతమేధావులని కీర్తిప్రతిష్ఠలొందిన ఇరువురు మహనీయులను మనకు ప్రసాదించినది. వారిలో ప్రథములు శ్రీ శంకర భగవత్పాదులవారు, రెండవవారు జ్ఞానదేవులు. వీరిరువురిలోను ఎన్నివేల వత్సరముల కైనను అలవి కాని ఘనకార్యములను ముప్పది రెండేండ్ల అల్పవయస్సుననే యొన రించిన అతిమానుష శక్తిసంపన్నులు శ్రీ శంకరాచార్యులవారు. వారిది ఆదర్శనీయ మైన దివ్యజీవనమని వచించుటలో నెట్టి అతిశయోక్తియు నుండబోదు.

శ్లో॥ అష్టవర్షే చతుర్వేదీ ద్వాదశే సర్వశాస్త్ర విత్ ।
షోడశేకృతవాన్ భాష్యం ద్వాత్రింశే మునిరభ్యగాత్ ॥

పై శ్లోకము ఆ పుణ్యశ్లోకుని సంగ్రహజీవితమును వివరించుచున్నది. శంకరుల వారు ఎనిమిది వత్సరముల వయస్సుననే చతుర్వేదియై, ద్వాదశవర్ష ప్రాయమున సకలశాస్త్ర పారంగతులైరి. పదహారేండ్ల వయస్సున ప్రస్థానత్రయమునకు భాష్యమును రచించి, ముప్పది రెండేండ్ల వయస్సున శివైక్యమును బొందిరి.

విశ్వమంతయు ఆధ్యాత్మికముగ అంధకారబంధురమై దారి తెన్ను తెలియక కేవలము స్వార్థాహంకారములతో అలమటించుచున్న తరుణమున, దేశవిదేశములలో ననేక కుమతములు కుక్కగొడుగులవలె నుద్భవించి మతులను పాడుచేయుచు మానవుని అపమార్గమున నడిపించి జన్మపరంపరాగర్తమున బడద్రోయుచున్న సమ యమున; పాషండమతములు, నాస్తికసిద్ధాంతములు దేశమున ప్రబలుచున్న కాలమున సకలదేవతలచే ప్రార్థింపబడి కైలాసాధిపతియైన శంకరుడు కరుణామూర్తియై మానవ లోకోద్ధరణకై దక్షిణ భారతమునగల కేరళలో కాంతికిరణమై అవతరించెను.

కేరళప్రదేశమనాది నుండియు సదాచారసంపన్నులకు, మేధావులకు, వైరాగ్య నిధులకు కాణాచియని ప్రసిద్ధిగాంచినది. అట్టి పవిత్ర భూమిలో ప్రవహించు పూర్ణా నదీతీరమునగల కాలడియను నొక చిన్న అగ్రహారమున సదాచారసంపన్నులును,

నంబూద్రి బ్రాహ్మణ వంశస్థులును, పుణ్యదంపతులును, శైవారాధకులునునగు ఆర్యాంబా శివగురులకు ఏకైక సంతానముగ జన్మించిన శంకరులు ఆసేతుహిమాచల మునవేగాక యావత్ప్రపంచమునందంతటను అద్వైత జ్యోతిని వెలిగించి ఆచార్యవర్యులుగా విరాజిల్లిరి.

రెండవ ఏటనే తండ్రిని పోగొట్టుకొని, పంచవర్షప్రాయమున ఉపనీతుడైన శంకరుడు ఉపాధ్యాయులనాశ్రయించి షడంగ సహితముగ వేదములను అధ్యయన మొనరించిన ఏకసంథగ్రాహి. విద్యాభ్యాసకాలమున ఒక ఇంటికి భిక్షార్థమై యేగి నిరు పేదరాలైన ఆ గృహిణిని కనికరించి కనకధారాస్తోత్రముచే శ్రీ మహాలక్ష్మిని ప్రసన్న మొనరించి ఆ గృహమున బంగారపు టుసిరికాయలను వర్షింపజేసిన సహజ సిద్ధ పురుషుడు. అంతేగాక, స్నానార్థమై నదికేగి ఎండ తీవ్రతకు కాలిన ఇసుక తిన్నెలపై నడువ లేక స్పృహ తప్పిపడియున్న తల్లినిగాంచి కనికరించి యేటిని తన గృహము ప్రక్కగా ప్రవహించునట్లొనరించిన మాతృభక్తి పరాయణుడు. మఱియు కేరళ దేశాధిపతియైన రాజశేఖరునకు పుత్రప్రాప్తియగునట్లు వరమును ప్రసాదించిన దయామయుడు శంకరుడు.

జగదుద్ధరణకై యేతెంచిన అవతారమూర్తిగాన నెట్టి సాంసారిక బంధములలో నుండ నిచ్ఛగించక సన్న్యాసదీక్ష తీసికొనుటకై అతి బాల్యముననే శంకరులు మాతృ మూర్తిని అభ్యర్థించెను. ఏకైక సంతానమగుటచే పుత్ర వ్యామోహములోబడి ఆ మాతృమూర్తి అయిష్టత వెల్లడించినది. ఇట్లుండనొకనాడు మాతాపుత్రులు నదిలో దిగి స్నానమొనరించుచుండ ఒక మకరము (మొసలి) శంకరుని కాలు పట్టుకొనెను. వెంటనే ఆతడు తల్లిని పిలచి బిగ్గరగా దుఃఖించుచు "అమ్మా! ఇప్పుడైనను సన్న్యాస స్వీకారమునకనుమతించుము. ఎటులైనను మృతి నొందుచుంటినిగాన, ఈ చివరి ఘడియలలోనైనను తృప్తిగా శాంతితో మరణించెదను" అని ప్రాధేయపడగా, ఆమె గత్యంతరములేక కుమారునకు శాంతి కలుగునని ఎంచి "సరియే"నని అనుమతించెను.

అది ఏమిచిత్రమోగాని, తల్లి అనుమతి లభించిన తక్షణమే మొసలి పట్టునుండి విడిపించుకొని, తీరముచేరి, మాతృదేవికి వందనమాచరించి ఆమె తలంచినప్పుడే తెంచదనని మాటనిచ్చి, వెంటనే ప్రయాణమై శంకరులు నర్మదానదీతీరమున నివసించుచున్న గోవింద భగవత్పాదులవారి దరిజేరి వారికి శిష్యులై సశాస్త్రీయముగ సన్న్యాసమును గ్రహించి జ్ఞానసంపాదనమొనరించిరి. అట్టి జ్ఞానమును శ్రీ శంకరులు ప్రజలకుద్బోధించి లోకోద్ధారకులై విరాజిల్లిరి. ○○

# వేదాంతభేరి [illegible]

[illegible]

### వేదాంతభేరి మాసపత్రికకు మూలానముగ చేరిన శాశ్వత చందాదారుల పేర్లు

### శాశ్వత చందా రు. 300/-లు

శ్రీ ఎ. సర్వాగౌడ్ గారు - ముష్కాల్
శ్రీ టి. రాఘవరెడ్డి గారు - హైదరాబాద్
శ్రీ వి. రాజగోపాల గుప్త గారు - గుంటకల్
శ్రీ జి.వి. సుబ్బరాజు గారు - సికింద్రాబాద్
శ్రీమతి డి. సీత గారు - మద్రాసు
శ్రీ పి. సచ్చిదానందం గారు - విశాఖపట్నం
శ్రీ టి. సత్తయ్య గారు - కరీంనగర్
శ్రీ పి. గోవిందప్పశెట్టి గారు - బళ్ళారి
శ్రీ పి. శ్రీమన్నారాయణ గారు - గుంటూరు
శ్రీ టి. సత్యనారాయణ గౌడ్ గారు - హైదరాబాద్
శ్రీ ఎస్. రాజ్యలక్ష్మి గారు - విశాఖపట్నం
శ్రీ పి.ఎల్. నరసింహారావు గారు - హైదరాబాద్
శ్రీమతి ఆర్.ఎస్. కుమారి గారు - బెంగుళూరు
శ్రీ బి. శ్రీనివాసరావు గారు - నూజివీడు
శ్రీ పి. చిన్నగంగారామ్ గారు - నిజామాబాద్
శ్రీ డి. ధర్మారావు గారు - పాండిచ్చేరి
శ్రీ మెట్ల కొండయ్య గారు - పేరాల
శ్రీ సిహెచ్. రమేష్ గారు - నిజామాబాద్
శ్రీ ఎమ్. రుక్మిణి గారు - బొంబాయి
శ్రీ వి. చంద్రమతి గారు - విశాఖ



**Printed and Published by Vemuri Balaram for Sri Sukabrahma Ashram,**
**Sri Kalahasti Printed at Swati Press Anil Estates Vijayawada**
**Editor : B. ESWAR**

# నారద భక్తి సూత్రములు-72

## నాస్తి తేషు జాతి విద్యారూపకులధన క్రియాది భేదః

***తా/*** *భక్తులయందు జాతిభేదముగాని, విద్యాభేదముగాని, రూపభేదముగాని, కులభేదముగాని, ధనభేదముగాని, క్రియా భేదముగాని ఏమియు ఉండదు.*

వ్యాఖ్య :- భక్తులు తమ సర్వస్వమును భగవంతునకర్పించి మహా పవిత్ర జీవితమును గడుపుచుందురు.. వారిలో జాతి భేదము ఉండదు. అనగా ఒకడు ఉత్తమజాతి, మఱి యొకడు నిమ్నజాతి- అను భేదము ఏ మాత్రము ఉండదు.

అట్లే విద్యావంతుడు, విద్యావిహీనుడు అను భేదముగాని; రూపవంతుడు, కురూపి అను విచక్షణగాని; కులీనుడు, అల్పకులస్థుడు అను భేదముగాని; ధనవంతుడు, నిర్ధనుడు అను తారతమ్యముగాని; క్రియాశీలుడు, అక్రియుడు అను భేదముగాని- ఏమియు ఉండదు.

భక్తులందఱు సమానులే. వారిలో భక్తిరసము పరిపూరితమై యుండును. భక్తిరసామృతమును వారు నిరంతరము గ్రోలుచుందురు. వారందఱు ఒకేజాతి. దైవజాతి. ఒకే కులము. దైవకులము. వారిలో జాతి మత కులాది భేదములెవ్వియు ఉండవనియు, వారందఱు దైవభక్తి యను ఒకే సమాజమునకు చెందినవారనియు ఇట పేర్కొనబడినది.

ఓం